# త్యాగమయి

(ఖండ కావ్యం)

డా॥ శోభిరాల సత్యనారాయణ
యం.ఏ., పి. హెచ్. డి.,

శ్రీ విశ్వకర్మ విజ్ఞాన కేంద్రం
శ్రీకాకుళం - 532 001

THYAGAMAYE
*Dr. Sobhirala Satyanarayana*

© SRI VISWAKARMA VIGNANA KENDRAM
SRIKAKULAM - 532 001

ప్రచురణ : ఫిబ్రవరి 2001
ప్రతులు : 500
మూల్యము : 15/-

ప్రతులకు :
శ్రీమతి శోభిరాల బాలాత్రిపురసుందరి
G. F. 3, అలంకృత అపార్ట్‌మెంట్స్,
పటమటలంక
విజయవాడ-14

సంచాలకులు,
విశ్వబ్రాహ్మణ ధర్మపీఠం
4-1-11, విశ్వకర్మ భవనం
తిలక్ రోడ్, బొగ్గులకుంట
హైదరాబాద్ - 500 001

ప్రఫుల్ల చంద్ర
2-6-36, కళాప్రపూర్ణ భవనం
గాంధీనగర్, తెనాలి.

ముద్రణ :
వాణీ ఆర్ట్ ప్రింటర్స్, తెనాలి. ఫోన్ : 24019

# అంకితము



తన శైశవ బాల్యదశల
ఆనందామృతాన్ని
మా దంపతులకు
చూరలిచ్చిన
మా చిన్నతల్లి
కూచిపూడి - భరతనాట్య ప్రవీణ
**శ్రీమతి గుంటూరు శ్రీవిద్యను**
శ్రీ లలితా మహాదేవి
ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి
కాపాడుగాక !

— అమ్మానాన్నలు

# ముందుమాట

'విశ్వజ్ఞ' బిరుద విభూషితులు, వాస్తు జ్యోతిషవిద్యాప్రవీణులు డా॥ శోభిరాల సత్యనారాయణగారు బౌద్ధ గాథలలోని ఒక కథ ఆధారంగా ఈ 'త్యాగమయి' ని రచించారు. "స్నేహమయి" కావ్యం తరువాత, "రాగమయి" కావ్యానికి ముందుగాను రచింపబడిన ఈ "త్యాగమయి" వారి ఇతర గ్రంథాల రచనా ప్రచురణాల వ్యాసంగంలో వెనుకపడిపోయింది.

వారు 8-2-'96 న స్వర్గస్థులగుటచే దాని ప్రచురణ బాధ్యతను నేను స్వీకరించవలసి వచ్చింది. దీనితో పాటుగా శ్రీ శోభిరాలవారు శ్రీకాకుళం జిల్లాలో గల శైవక్షేత్రం "శ్రీముఖలింగము" ను గూర్చి, బౌద్ధారామం "శాలిహుండము" ను గూర్చి రచించిన పద్య ఖండికలు రెండు కూడ ఈ ఖండకావ్యంలో చేర్చటం జరిగింది. ఈ రెండు లోగడ విశాఖపట్నం ఆకాశవాణి కేంద్రం నుండి ప్రసారితమైనాయి.

"త్యాగమయి" ని గూర్చి - తమ అమూల్యాభిప్రాయంతో, శ్రీ శోభిరాల వారిని మహాకవితాశిల్పిగా పఠితలకు సాక్షాత్కరింపజేసిన - సాహిత్యబ్రహ్మ. రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ పురా సంచాలకులు శ్రీ వాసిలి వేంకట లక్ష్మీనరసింహారావుగారికి నా మనఃపూర్వక నమోవాకములు, కృతజ్ఞతలు.

గ్రంథ ప్రచురణ బాధ్యత వహించి దానిని చక్కగా నిర్వర్తించిన పుత్రతుల్యుడు (నా సోదరి శ్రీమతి ఆలూరి సుమతీదేవి కుమారుడు) ప్రఫుల్ల చంద్రకు శుభాశీస్సులు.

ఆంధ్ర సాహితీలోకం ఈ ఖండకావ్యాన్ని శ్రీ శోభిరాల వారి ఇతర కృతుల వలెనే ఆదరించును గాక !

— శోభిరాల బాలాత్రిపురసుందరి

# మహా కవితాశిల్పి మన శోభిరాల

'సాహిత్యబ్రహ్మ'
డా॥ వి. వి. యల్. నరసింహారావు
పురా సంచాలకుడు; రాష్ట్రీ కేంద్ర ప్రభుత్వ విద్యాశాఖ

ఔను; అక్షరాల అది నిజం. మన శోభిరాల మహాకవితా శిల్పి. అందుకు సాక్ష్యం అలనాడు ఆయన రచించిన 'రాగమయి' కావ్యం; ఇంకా ఇంకా అనేక పద్యఖండికలు.

ఇప్పుడాయన మన మధ్య లేడు; కీర్తిశేషుడు. కీర్తిశేషులనేది కన్నుమూసిన అందరికీ అన్వయిస్తుంది. కేవలం ఆ అర్థంలో మాత్రమే ఆయన కీర్తిశేషుడు కాడు. తన రచనల వల్లనే ఆయన కీర్తిశేషుడు.

ఆ కవితాశిల్పి అర్ధాంగి శ్రీమతి బాలాత్రిపురసుందరి. సాహితీశిల్పదర్శనం చెయ్యగల రసజ్ఞురాలు. దర్శనాచార్య డా॥ కొండూరు వీరరాఘవాచార్యుల పుత్రిక. అటు పుట్టింట, ఇటు అత్తింట - ఉభయత్రా సాగిన సాహితీ దర్శనం శ్రీమతి బాలా త్రిపురసుందరిది.

శ్రీవారి రచనల్లో అముద్రితంగా ఉన్న రచనల్ని అవశ్యం ముద్రించాలని సంకల్పించారు త్రిపురసుందరిగారు. ఒకనాటి 'రాగ మయి' లాగే ఇప్పుడొక 'త్యాగమయి' దర్శనమిచ్చింది. త్యాగ మయి కావ్యంతోపాటు 'కోణార్క' కావ్యం కూడా కంటబడింది. ఆమె కన్నులు చెమ్మగిల్లాయి. భర్తగారి కావ్యాల వ్రాతప్రతులు నాకు చూపారు. నా కన్నులు మరీ మరీ చెమ్మగిల్లాయి.

సంతోష బాష్పాల తీరు ఇంతేనేమో !

ఈ 'త్యాగమయి', ఆ 'కోణార్క' - రెండూ శిల్పుల జీవితాన్ని పరివేష్టించిన పద్యకావ్యాలే. 'కోణార్క'లో 204 పద్యాలు; 'త్యాగమయి'లో 36 పద్యాలు. ఉత్తమ కావ్యానికి పద్యసంఖ్య ముఖ్యం కాదు గదా ! వాక్యం రసాత్మకం కావ్యమ్.

ప్రస్తుత కృతి 'త్యాగమయి' బౌద్ధజాతక కథల కోవకు చెందింది. అన్నట్లు ఇందులో ఆనందభిక్షువుకూడా సాక్షాత్కరిస్తాడు. ఆనందభిక్షువు బుద్ధదేవుని శిష్యుల్లో ప్రసిద్ధుడు గదా ! అంటే ఈ 'త్యాగమయి' వృత్తాంతం బుద్ధుని జీవితకాలంలో ఉత్తరార్ధంలో జరిగింది కావచ్చు.

త్యాగమయి అలనాటి ఆంధ్రరాజపుత్రి; అందాలరాశి. పేరు జయశ్రీ అద్భుత నర్తకీమణి. చిత్రలేఖనశిల్పి అయిన నాగసుందరుణ్ణి ప్రేమిస్తుంది. నాగసుందరుడు ఆమె కళాసౌందర్యాదులకు ముగ్ధుడై ఆమె చిత్రాన్ని కూడా లిఖించాడు. ఆమె చిత్రాన్ని పటం (వస్త్రం) మీద మాత్రమే లిఖించాడు కాని మనస్సులో లిఖించుకోలేదు. 'జయ' తపన అతని మనస్సులో తాను చిత్రించబడాలనే. ఆమె అతన్ని తన యింటికి ఆహ్వానించింది. అతడు వచ్చాడు - నిర్వికారమైన మనస్సుతోనే. అతని ప్రణయ పరిష్వంగం కోసం చేతులు చాచింది జయశ్రీ. అతడు నిశ్చేష్టుడుగా ఉన్నాడు. ఆమె కన్నుల వెంట బాష్పధారలు ! నాగసుందరుడు ఆ బాష్పాలు తుడిచాడు. ఆ స్పర్శకు జయశ్రీ ఆత్మ పులకించింది. ఈ జన్మకిది చాలుననుకొన్నది. ఆత్మీయమైన ఒక ముద్దు తనకు తానే పెట్టుకొన్నది.

అంతలో ఎక్కడి నుంచి వచ్చిందో ! కాలసర్పం !

నాగసుందరుణ్ణి కాటువేసింది. అతడు కన్నులు తేల వేస్తున్నాడు. జయశ్రీ అతని దేహంలో పాము కాటుపడిన తావున తన పెదాలు చేర్చి అతనిలోని విషమంతా తాను పీల్చుకుంది. అతడు తేరుకున్నాడు. తాను కన్నుమూసింది. జయశ్రీ లేని నాగ సుందరుడు మిగిలాడు.

అతడు కన్నీరు మున్నీరుగా నిర్విణ్ణుడైనాడు.

"జయ యేదీ ? ప్రియ యేదీ ?
నయనానందము ఘటించు నర్తకి యేదీ ?
దయనీయ యేది" యని వి
స్మయమును కలిగించె బౌద్ధ సన్యాసి కడున్.

ఈ పద్యంతో ఆరంభమౌతుంది 'త్యాగమయి' కథ. పైగా నాగసుందరుడు బౌద్ధ సన్యాసి. తనకోసం ప్రాణాలు విడిచిన జయశ్రీ కోసం అలమటించిపోయాడు. ఆ స్థితిలో అతన్ని చూశాడు ఆనందభిక్షువు. విషయం తెలుసుకున్నాడు. జీవం లేకుండా పడి ఉన్న ఆంధ్రరాజపుత్రి జయశ్రీని చూచాడు. ఆనందభిక్షువు నాగ సుందరుణ్ణి అడిగాడు.

"సుగత మార్గానుసారి భిక్షుకుడ వీవు
సుగుణవతి నవయౌవన శోభితాంగి
ఈ దయామయి ఆంధ్ర నరేంద్ర తనయ
ఈమెతో ఇట్టి పరిచయ మెటుల కలిగె ?"

ఈ ప్రశ్నకు జవాబుగా నాగసుందరుడు చెప్పిన ఆత్మకథ త్యాగమయి కథ. ఒకరకంగా Flash Back Technique లో నడచిన కథ. అన్నీ కలిపితే 86 పద్యాలు.

ఇటు పద్యశిల్పం కాని అటు కథాశిల్పం కాని ఆద్యంతం ముత్పులకలు కలిగిస్తాయి.

రసానంద మంటే ఇదే కదా !
మహాకవితా శిల్పం కుప్పవోసినట్లు అనుభూతి కలిగిస్తుంది కావ్యం.
శోభిరాల సత్యనారాయణ ఇప్పుడు నిజంగా కీర్తిశేషుడు.

ఆయన 'త్యాగమయి'ని అఖిల రసజ్ఞులకూ అందుబాటులోకి తెచ్చిన శ్రీమతి బాలాత్రిపురసుందరిగారు అభినందనీయురాలు.

హైదరాబాద్
28-5-2000

— ఐ. వి. యల్. నరసింహారావు

# వి ష య సూ చి క

| | పుట |
|---|---|
| ముందుమాట | iv |
| మహాకవితాశిల్పి మన శోభిరాల | v |
| త్యాగమయి | 1 |
| శ్రీముఖలింగము | 19 |
| శాలిహుండము | 27 |



# సకలాంజలి

ఓం ఐం హ్రీం శ్రీం
సకలాయై నమః

* * *

సకల జగజ్జనయిత్రిని
సకలాధిష్ఠాన రూప సర్వాధారన్
సకల మనోన్మణి సమరస
సకలేష్టద శాస్త్రసార సన్నుతిఁ జేతున్.

కంజలోచన కమనీయ కారయిత్రి
కంబుకంఠి కలాలాప కావ్యలోల
కర్మఫలదాత్రి కామేశి కల్పవల్లి
కరుణ మమ్మేలు గాత విజ్ఞాన కలన.

లక్షణోజ్జ్వల దివ్యాంగి లబ్ధరూప
లబ్ధనానాగమస్థితి లబ్ధభోగ
లక్షకోట్యండనాయిక లలిత మాకు
లబ్ధ సంపత్సమున్నతి లభ్యమగుత

హ్రీంకారాంగణదీపిక
హ్రీంకారసువర్ణ సౌధశృంగకపోతిన్
హ్రీంకారాధ్వరదక్షిణ
హ్రీంకారేశ్వరిఁ దలంతు హృత్కమలమునన్.

— శోభిరాల

# త్యాగమయి

"జయ యేదీ ప్రియ యేదీ
నయనానందము ఘటించు నర్తకి యేదీ
దయనీయ యేది ?" యని వి
స్మయమును గలిగించె బౌద్ధసన్యాసి కడున్.

వాని మాటలు విని యానందభిక్షువు
తేఱిపారఁ జూచె దిక్కు లెల్ల
రాకుమారి జీవరహితయై పడియున్న
దృశ్యమరసి సుంత తెలిసికొనియె.

"సుగత మార్గాను సారి భిక్షుకుఁడ వీవు
సుగుణవతి, నవయౌవన శోభితాంగి
యీ దయామయి యాంధ్ర నరేంద్ర తనయ;
ఈమెతో నిట్టి పరిచయ మెట్లు గలిగె ?"

"సంఘసేవా పరాయణ సాధుశీల
రాకుమారి జయశ్రీ నిరంతరంబు
వచ్చుచును బోవుచుండి నాపైఁ నొకింత
పేర్మియును సౌహృదమ్మును పెంచికొనియె.

మఱవఁ దరంబె నా జయను మార పరాజయ చిత్రలేఖనాంతర హృదయాంతరుండనయి తద్గత భావతరంగ మాలికో త్కరముల దేలుచున్న తఱి కల్కి నను న్ గనిపల్కె; "నాగసుందర ! క్షమియింపఁగా వలయుఁ ద్వద్రసనిష్ఠకుభంగ మేర్పడెన్.

కరుణరస ప్రధానమగు ఘట్టమొకండు రచింపఁబూనితో ? తరుణిని బాసిపోయిన తథాగతు రూపురచింతొ ? నాగసుందరి, రతి, తృష్ణ లేగతిని నాట్యము చేసిన, వానిఁ జూచి నిబ్బరముగనున్న బుద్ధభగవానుని రూపము వ్రాయనెంచితో !"

"నిజమది ! కాని నేనెపుడు నృత్యములన్ దిలకింపలేదు, నీరజనయనా ! విలాసినుల కౌల్గిలులన్ గమనింపలేదు, ప్రవ్రజితుఁడఁ జైత్య ధర్మపరిపాలకు లిచ్చట బుద్ధచిత్రముల్ సృజనము సేయుమన్న బదులేమియుఁ జెప్పక కుంచెవట్టితిన్."

నా మాటలను విని నలినదళాక్షి
నా మేలుగోరుచు ననుఁజూచి పల్కె.

"మనకేకాంతము గల్గెనేని ధృతి నస్మన్మందిరో పాంత నర్తనశాలన్ రసభావయుక్త మృదుగీత స్వస్తిపూర్వమ్ముగా గనువిందున్ గలిగించునట్టు లెలమిన్ గావింతు స్వచ్ఛంద వృత్తిని నృత్యమ్మది నీ ప్రయత్నమునకున్ దివ్వెల్ వెలింగించుతన్"

ఓ సుకుమార చిత్త ! యెదనోడక వెన్నెల తేని తోడ నీ
హాస సుధాంశు చంద్రికల నస్మదుపాంశుగృహమ్ము నింప ర
మ్మా సమయాన నీ మదికి హత్తుకొనందగు రీతి లాస్యమున్
జేసెద; రాణివాసమును జేరగ రమ్ము వసంత పంచమిన్."

"కోరికలు లేని బౌద్ధ భిక్షువును నేను
రాఁదగదు మీదు ప్రాసాద రాజములకు
నన్ను మన్నింపు" మనఁ జిరునవ్వుతోడఁ
జతురముగఁ బల్కె నాంధ్ర భూజాని తనయ.

"నీ సరివారలేరి ? కమనీయగుణోజ్జ్వల ! చిత్రలేఖనా
భ్యాసమునన్ గళాప్రియుల కాదరణీయములెల్ల విద్యలున్
తోసము గల్గు, నర్తనము తోడ్పడు నీరచనోద్యమంబునన్
దోసము లేదు లెమ్ము తమితో దిలకింపక యున్న నాహొయల్.

భిక్షుగై కొన బుద్ధుండె ప్రేమతోడ
భోగకాంతల యిండ్లకుఁ బోయెనంద్రు;
రాజగృహమున కరుదేర రాదొ నీవు ?
మత్కృతాతిథ్యమున కనుమాన మేల ?"

అనుచు నిష్ఠుర భాష లాడెడి భామ
ననునయించితి నెయ్యమున మొగమాట.

"అతఁడు సిద్ధార్థుఁడతఁడు మహాత్ముఁడతఁడు
సర్వసంగపరిత్యాగి శాంతమూర్తి
తత్త్వ జిజ్ఞాసఁ దిరుగు సాధకుఁడ నేను
పూర్ణశశితోడ నెలబాలుఁ బోల్పనగునె ?

"అయినను బౌద్ధధర్మముల నాదర మొప్పఁగ నీవు నాపయిన్
దయఁగొని మేలు సేయు నెడఁ దర్కవితర్కము లేల ? లౌకిక
క్రియలకు నాత్మలోఁగొనని రీతి క్షణం బట నుండి వచ్చెదన్
జయ ! రచియింతు చిత్రములు చక్కఁగ సాధుజన ప్రియంబుగా.

"అనుమాన మ్మొకయింత లేదు చెలి ! నీ యాతిథ్యమున్ స్వీకరిం
తును, నిశ్చింత వసంత పంచమిని వత్తున్; నీవె యానాఁడు నే
ర్చిన రీతిన్ గమనీయ గీతములతో నృత్యంబు గావించి న
న్నను శాసింపుము చిత్రలేఖన కళావ్యాసంగ రంగమ్మునన్"

ఆ విధమ్ముగఁ గుతూహలము కల్గించి
వేవేగ ననువీడి వెడలె రాట్పుత్రి

"చిత్రములన్ రచించికొను శిల్పిపయిన్ మమకార మేమి రా
ట్పుత్రికి ? బౌద్ధధర్మ పథమున్ గని సంఘము సేవజేయు నా
మైత్రిని గోరు టేమి ? యభిమానముతో నటనమ్ము సూపఁగా
రాత్రిననున్ రహస్యముగ రమ్మను టేమి ? ప్రసన్నచిత్తయై.

కామము చేత శోకమును గాతర చిత్తము గల్గుగాని, ని
ష్కామ నిష్కృష్ట చిత్తునకుఁ గల్గవు శోకభయాదు లెన్నఁడున్
గామవికార దూరుఁడయి కాంతల చెంగటఁ జేరియుంట యే
భూమి నసాధ్యమంచు మనపూర్వులు చెప్పిరి సత్యమెద్ది యో" ?

ధర్మసూత్రమ్ములను మదిఁ దలఁచుకొనుచుఁ;
రాకుమారిక పంపిన రథము నెక్కి
చిత్రమగు రాజసౌధమ్ము చేరుసరికి
వెన్నెలలు నిండి ననుఁ జూచి వెక్కిరించె,

అరదమును డిగ్గి నంత నత్యంత భక్తి
తరుణు లిర్వురు నాదు పాదములు గడిగి
గంధమాల్యాదు లర్పించి గారవమున
స్వాగతము పల్కినారు పుష్పములు జల్లి.

"స్వాగతమో మహాత్మ ! నరపాల తనూభవ యేకతంబ మీ
యాగమ నమ్మోదం దలచు చాత్మగృహమ్మున హర్షపూర్ణయై
సోగలు నీరు కన్నులకు సొంపులు దిద్దుచుఁ గూరుచుండె హే
లాగతులన్ దిశల్ గనుచు లబ్ధమనోరథ యయ్యె మీకృపన్"

ఆ రమణులంతే నంతఃపురాంగణమున
శుభ్ర దంతాసనమ్మును జూపినారు
చల్లచల్లని పన్నీరు చల్లినారు
పూర్ణచషకమ్ము నందించి పోయినారు.

రాజమందిర కుడ్యచిత్రముల తీరు
విమల మణిమందిరాంతర వివిధ శిల్ప
సంభృతానేక వస్తు సంచయము సౌరు
తనరి రాచూలి యెడద కద్దమ్ము వట్టు

అగరు ధూపమ్ము గదియెల్ల యావరించి
హాయి గొల్పుచు నుండ చిత్రావలోక
నమ్ము నేసితిఁ గవాక్షాంతరమ్ము నుండి
కూనిరాగము వినిపించె కొంత సేపు.

ఆలోన వచ్చె నాయమే
ణీ లోచన కటక కింకిణీ రవములతో
సాలంకృతయై నర్తకి
వోలెన్ జోహారు సేసెఁ బుష్పాంజలియై.

"ఓ సరళస్వభావ! దయయుంచి యిటుల్ సనుదెంచినావు సం
తోసముతో మనమ్ము కడు తొట్రిలుచున్నది ప్రేమతోడ నీ
కోసము తీసి పంపితిని గొంచెము ద్రాక్షరసమ్ము ద్రావి యా
యాసము దీర్చి కొమ్మవల నాలతి నృత్యము చేసి చూపెదన్.

"ఓ మహితాశయా! హృదయముండియు లేనటులుండనేల? యీ
నీమములేల? జవ్వనపు నిగ్గులు తగ్గఁ గృశింపనేల? ప్రే
మామృత పూరముల్ ఫలరసాదులు గైకొను" మంచుబల్కుచున్
నా మెడలోన వైచినది నవ్వుచుఁ జంపక పుష్పదామమున్.

"ఇది నా కానుక స్వీకరింపఁ దగునోయీ! నీకు; వ్యర్థంబుగా
వదలన్ జూతురె భోగ్యవస్తువులు నిష్పన్నంబుగా సంశయా
స్పదవృత్తిన్ రుచి చూచినంత ఫలముల్ పాపంబులన్ గూర్చునే?
మది నూహించి యొకింత మానగరిలో మర్యాదఁ బాటింపుమా!"

ఆ సుమ సౌరభమ్ములు సుఖాసనముల్ రమణీప్రియోక్తులున్
నా సముఖానఁ గేల్మొగిచి నన్ బలవంతము సేయు నా జయ
శ్రీ సఖి ప్రార్థనల్, రస పరీప్సయుఁ జిత్తము నాహరింప ద్ర
షాసవమానితిన్ నిమిష మాత్మ్మత ధర్మము విస్మరించితిన్.

చదురాడఁ బోవునప్పుడు
పదముల నంటినదిఁ బ్రణయ భావముతోడన్
హృదయార్పణమ్ము చేసెను
ముదితకు నామీద నెంత మోహము గలదో.

"ఇదె చూడు మిటు చూడు మీ భంగిమమ్ము
ఇదె చూడు మిటు చూడు మీ హస్తముద్ర
ఇది పతాక మ్మిద్దియే త్రిపతాక
మిది మయూరము చూడు మిది శిఖరమ్ము.

ఇది సర్పితము చూడు మిటు దృష్టి నిలిపి
పిదప నాగాపసర్పిత మిద్ది కనుము
ఇది నితంబము చూడు మిది జనితంబు
ఇది వివర్తిత మిట్టు లీక్షింపు"మనుచు.

పొదలి మోహావేశమున నొడల్ మఱచి
నదరు బెదరును లేక నాముందు నిలిచి
హృదయరంజకముగాఁ జదురు చేసినది
మదిరాక్షి మఱి యేమొ మచ్చు చల్లినది.

“నీవ నా జీవితం బీవ ప్రాణమవు
నీవ నా తారుణ్య భావ మాధురివి
రావోయి ప్రేమానురాగముల్ పొలయ
రావోయి శృంగార రసధునుల్ పొంగ”

ఆ హంసగమన నాట్యానుభావమున
సౌహార్ద వల్లరుల్ సాగె నా యెడఁద
ఆ మంజువాణి గానామృత మాని
నా మనమ్మూగె నానందడోలికల.

ఆ యార్ద్ర చిత్తమా యభినివేశమ్ము
ఆ యంగ విన్యాస మాయభినయము
ఆ హావ భావమ్ము లా విలాసములు
మోహావిభ్రాంతిలో ముంచెత్తె నన్ను.

అభినేత్రి యంత నాట్యమును జాలించి
అభివందనము చేసి యనియె నీరీతి.

నాగసుందర ! నీకు నచ్చెనో లేదో
నా గీతగానంబు నా నర్తనంబు
నీవంటి మహానీయుఁడే వచ్చి వేడ్క
నా విద్యలను జూచి నన్ను మన్నించె
నా జన్మధన్యమైనది నేడు స్వామి
యీ జీవితమ్మునకీ తృప్తిచాలు.

వేళ యతిక్రమించినది, వెన్నెలఱేడు పయోధరాంతర
శ్రీల నడంగెఁ జీకటులు చిందెడి కంటకమార్గమందుబో
నేల నిశీథమం, దతిథిగా నుపకారిక నస్మదీయ సే
వాలఘు చర్చలన్ దనిసి ప్రత్యుషవేళఁ జనంగ రాదొకో"

ఆమె మాటలకు మాఱాడంగ లేని
నా మెత్తదనమెంచి నలినాక్షి పల్కె;

"అక్కజమొప్పఁ జిత్తరువు లందముగా రచియింతువంచుఁ బెన్
మక్కువఁ జూడవచ్చి యభిమానముతో సరసాంతరంగనై
ప్రక్కనఁ జేరి నిల్చినను భావమెఱుంగవు మారుపల్క వీ
వెక్కడి చిత్రకారుడవొ ? యెట్లు రచించెద వాక్కుచిత్రముల్ ?

స్వామి ధర్మార్థ కామ మోక్షమ్ములనెడి
నాల్గు పురుషార్థములు సమానముగ నెంచి
పూర్ణజీవితమును గడపుదురు జనులు
క్రుమ్మరిలనేల లోక విరుద్ధ చర్య ?

వయసు వాడవు చక్కని వాడ వీవు
ప్రోడి, ననుబోలు నొక యనురూపవతిని
పెండ్లియై గార్హపత్యంబు స్వీకరించి
సౌఖ్యముల దేల కేల యీ సాధువృత్తి ?

ఆసలు వీడి కామపురుషార్థము పాపమటంచు నెంచి స
న్యాసము పుచ్చుకోవలసినంతటి యాపదలేమివచ్చె నో
భాసురమూర్తి ? నిత్యమును ద్వత్పద సేవ యొనర్పనెంతు నీ
వేసము మాని కొంగుముడి వేయుము మామక సాహచర్యమున్

ఆ భామ సౌందర్య మా మాటతీరు
ఆ భర్తృదారిక యాదరణమ్ము
నన్ను ముగ్ధుని జేసినను, దెప్పరిల్లి
వన్నెలాడిని గాంచి పల్కితి నిటులు.

"బుద్ధుడు సర్వమానవ సముద్ధరణోద్యమ భవ్య భావనా
బద్ధుడు మా గృహమ్మునకు వచ్చి కృపామతి భిక్షవేడ నన్
బుద్ధునికిచ్చె మా జనని, పూతచరిత్రుని చేయనెంచి సం
సిద్ధత బౌద్ధ సంఘమునఁ జేరి తథాగతు నాశ్రయించితిన్.

నన్నుఁ దథాగతాశ్రితు వినమ్రగుణున్ సకలార్థదూరగున్
మన్నన జేసి నా మనసు మార్పదలంతువొ యేమొ గాని, రామా
యన్నులమిన్న నాట్యకళనారయ వచ్చిన వాడ గాని నీ
వన్నెయు వాసియున్ దలచివచ్చిన వాడను గాను భామినీ.

నీ సౌజన్యము వాక్చమత్కృతులు వన్నెల్ గానమాధుర్యముల్
నీ సౌహార్దము హావభావ విలస న్నృత్యంబు నీ పాద వి
న్యాసంబుల్ సరసంబులై నను మహానందాబ్ధి, దేలించెఁ గా
నీ, సన్యాసిని, అన్యచింతదగదో నీరేజపత్రేక్షణా !

రాగబంధాలఁ జిక్కి దుర్భర వియోగ
దుఃఖ వార్నిధి మునిగి వందురుట కంటె
తగులములు లేక శాంతి పథాన నెట్టి
యొడుదొడుకులేని జీవితం బొప్పు నాకు.

మమతలు పెంచుకోదగదు మానిని నాపయి; ధర్మదీక్ష స
ర్వమును ద్యజించి, బుద్ధ భగవానుని పాదము లాశ్రయించితిన్
క్రమముగ మాటి, శాంతిపథగామిగ సాధన చేయుచుంటి, నా
శ్రమకు ఫలంబు సంసృతియె శాశ్వత నిర్వృతిగాక యేగతిన్!"

అనిన మందస్మితాస్యయై, అమలచరిత!
యీ వితండ వాగ్వైఖరి కేమి గాని
చాల ప్రొద్దైన దింక విశ్రాంతి గొనుడు
చనుడు చనుఁడని జననాథ తనయ చనియె

మరి యొకనాడు వచ్చి చనుమానముతో ననుగూర్చి పల్కె "నో
సరసుఁడ ! నీదు చిత్రమున జవ్వని యెవ్వతె ? నన్నుఁబోలుఁ ద
ద్గురు కుచపాళిలోఁ గలదు కొంచెము లోపము, కాంతిమత్ పయో
ధరములు చూచియేని ముదితన్ సవరింపు మొకింత నేర్పుమై.

"కేవల కల్పనాకృతులు గీయుటకంటె యథార్థ చిత్రముల్
నీవు రచింప మే"లనుచు నెమ్మిగ నాకు హితమ్ము పల్కె రా
జీవ దళాక్షి; "నీవభిలషించిన యట్లె రచింతు వెళ్ళిర
మ్మో వరవర్ణినీ యిఁక గృహోన్ముఖవై పరిపూతచిత్తవై"

అని వేశలోక్తుల నర్థించినాఁడఁ
గనకాంగి కంపితగాత్రయై కలఁగి
కలువపూరేకుల కనులింతచేసి
తులకించి నామోము తిలకించి క్షణము
ఛలమునఁ దనపైట సవరించి కొనుచు
తలవాంచికొని పల్కెఁ దరుణి యీరీతి.

"వెడలక యుండునే యిచట వేడుక చూచుచు శాశ్వతంబుగా
వెడగునె ? యీ ప్రపంచమున వీరులు లేరె ప్రియంబు సేయరే ?
గడుసరి వౌచు నిర్భయముగాఁ బ్రతిరూపములన్ రచించుచున్
వెడలవు గాక నాయెడదఁ వీడి యిదెక్కడి న్యాయమో శఠా !

"నీ రచించిన చిత్రంపు నిగ్గుచూచి
దర్పణమ్మున నాదు సౌందర్య మరసి
రెంటికిని భేదమింత లేకుంటఁజేసి
నచ్చెఁగాఁబోలు ననుకొంటి నాదు సొగసు.

"సరస వచో విలాసముల సన్నుతిచేసిన, నృత్యగీతికా
సరణిని వెల్లడించినను చక్కదనమ్ములు చూపి త్వన్మనో
హార రచనా చమత్కృతికి నాశయ సిద్ధికి దారిచూపినన్
గరఁగదు నీ మనమ్ము కఠినంబయి; దీనుల నెట్లు గాచునో !

"రాగము శోకహేతువని వ్రాసిరి గ్రంథములందు, గాని యీ
రాగమె సృష్టిమూలమని ప్రాజ్ఞులెఱుంగరొ ? రాగవల్లరుల్
తీగలు సాగవో ? పరిణతిన్ గన నీవొకరుండ వీ సుఖ
త్యాగము సేయకున్న వసుధాస్థలి కేమియు లోటు రాదులే".

అని గిరుక్కునఁ దిరిగి పోయినది నాడు
చుఱచుఱం జూచి నావైపు సుందరాంగి
మరల నీనాడె వచ్చె నా కొఱకు వలఁతి
యింతలో నింత యయ్యె నీవింత యేమొ ?

నను దరిశింప వచ్చినది నా జయ నేడు కదంబమాలికా
ఘన కబరీ పరీమళము గ్రమ్ముకొనన్ హృదయమ్మురంజిలన్
వెనుకగ నిల్చి చూచెఁ గఁడు వింతగ చిత్తరు వే రసానుభూ
తిని గలిగించెనో ! ద్రుతగతిన్ గదలించె మదీయ బాహువుల్.

"ఎపుడు వచ్చితి వీ చోద్యమేమి దేవి ?
తాకితివి నన్ను తప్పుగాఁ దలపవో క్కొ ?
ఐహిక సుఖంబులను వీడినట్టి వానిఁ
బ్రణయ వల్లరి బంధింపఁ బాడియగునె ?"

కలువ పూ రేకుల కనులింత జేసి
తులకించి నా మోము తిలకించె క్షణము
ఛలమున తన పైట సవరించుకొనుచు
తలవాంచి కొని పల్కె తరుణి యీ రీతి !

"ఇది నా దోసముగా దలంపను సఖా ! ఏనాటిబంధంబొ నీ
పదసాన్నిధ్యము నాకు గూర్చినది సంభావ్యంబు భవ్యంబునై
హృదయాహ్లాద కరమ్మునైన మనమైత్రీ వృక్షమున్ బెంచి దో
హదమున్ జేసెడి చిత్రకర్మ కనుమో ఆచార్య నీకున్నతుల్.

"త్వన్మనోహర చిత్ర సందర్శనోత్సు
కతను వచ్చితిఁ, గనులారఁ గంటి నిన్ను
తన్మయత్వమ్ము చెంది స్వాంతమ్ము పొంగఁ
గెరలి యాడితిఁ గోర్కులు క్రేళ్ళు దాట.

మది నౌత్సుక్యము సర్వజంతు సహజంబై పొల్చుఁ బ్రాయమ్మునన్
మదనప్రేరణ చిత్తజాత విలసన్ మాధుర్య ముద్వేలమై
గదలించున్ జనులన్ బరస్పర సమాకర్షంబు గావించుచున్
ముదమున్ గూర్చి యొసంగు సౌఖ్యములు పెంపున్ నూతనోత్సాహమున్

ప్రకృతి పురుష మనోహర ప్రణయలీల
యే కదా యీ చరాచర సృష్టియెల్ల !
ప్రకృతి ధర్మము వీడి విరాగివగుచు
గడపెదే జీవితంబిటు క్రమము దప్పి ?

కాంతలు పూరుషుల్ గలిసి కాపురముండి ననే కదా జగం
బంతలు నంతలై పృథివి యెల్లను నిండె మనుష్యకోటితో
నాంతర దృష్టిఁ జూడు మిటులందఱు నీ వలె సన్యసించు-చో
నంతము నొందదే జగతి యావల మీపని యేమి చెప్పుమా ?

కులటలతో నధర్మరతి కూడదటంచు వచించెఁగాక, ని
ర్మలమతి నిన్నుఁ జేరి పరమార్థముగాంచఁదలంచు కూర్మి తొ
య్యాలి నిటు ద్రోసిపుచ్చఁదగవౌనె ? యశోధర బెండ్లియాడి రా
హులు సుతుఁగాంచఁడే సుగతినొందక పూర్వము బుద్ధదేవుడున్ ?

వయసులోన నున్న వారలు తమ కోర్కు
లడచి కొన్న నెడఁద యుడికి యుడికి
పడగలెత్తి మదిని జెడగొట్టుఁ దెలియని
దేహ జాడ్యములను దెచ్చిపెట్టి.

యోగమున దేహమలయింప కుండవలయు
నొలసి రాగాబ్ధి మునిగి పోకుండ వలయు
రెంటికిని మధ్య మార్గమ్మె శ్రేయమనుచు
బుద్ధుఁడు వచింపఁడే మున్ను పుణ్యచరిత !

తనువు లశాశ్వతంబులని తాలిమిదక్కి ప్రపంచధర్మముల్
బనివడి పీడి సంఘమున భ్రాంతిగఁ జేరిన యంతమాత్ర నీ
మనమొక యింత మారినదె మారిన చిత్రములన్ రచింతువే !
కనులును వీనులున్ రసన ఘ్రాణము త్వక్కును మానునే పనుల్?"

"ఓ లలితాంగి నీవు చతురోక్తుల నన్ననురాగ మాధురీ
లోలుపుఁ జేయఁబూనెదవు ? లోకహితమ్మును గోరుభిక్షువే
లీల వశంవదుండయి మలీమసభావములన్ మెలంగుఁ దృ
ష్ణాలత వ్రేళ్ళు నాటుకొనినన్ వెడలించు కొనంగశక్యమే ?

పంచేంద్రియములు మనలను
వంచించెడు గాక సత్ప్రవర్తన తోడన్
జంచల బుద్ధిని విడి చరి
యించుటయే ధర్మసూక్ష్మ మిహపరములకున్.

తగదు మనకిది యాంధ్రధరాత్మనయ ! వినుము
దుఃఖ హేతువుఁ దొలగింపఁ దొడరు దేని
శరణు ధర్మంబు బుద్ధుండె శరణు మనకు
కామ వాసన లేని సంఘంబె శరణు."

అతివ నామాట వినుచు, నున్నట్టులుండి
దీర్ఘనిశ్వాస మొనరించి, దెప్పరమునఁ
బొంగి పొరలెడి దుఃఖమాపుకొనలేక
యవమతిని వెక్కి వెక్కి యేడువఁదొడంగె.

ఆమె కన్నీరు గార్చుచు నచట నిలువ
నుత్తరీయమ్ముతోఁ గనులొత్తినాడఁ
దత్కపోలము నా పాణితలము దవిలె
ముదిత పెదవులు మృదు శబ్దములను జేసె.

"ఇక నిన్ను బాధపెట్టను
సుకృతీ ! నీవంటి దివ్యసుందరమూర్తిన్
త్రికరణ శుద్ధిగ నంటితి
నొకపరి యదె చాలు జీవితోపస్థితికిన్."

అని చెలి పలికెడు సమయ
మ్మున తెలినాగొకండు వచ్చి మోహావేశ
మ్మున జయ చుంబించిన స్థల
మున నన్నొక కాటునైచిపోయె సరసరన్.

కాటు వడిన చోటఁ గఱచు చున్నట్లు తో
చినది, యవల నాకు స్మృతియె లేదు;
నన్నుఁ జేరగోరు నా జయశ్రీ యెటు
బోయె ? భుజగమెట్లు పోయె నొక్కొ ? ?

క్షణిక సుఖతుష్టు, భ్రష్టు, భుజంగదష్టు
నన్ను రక్షింపఁబూనొక్కన్న నీరజాక్షి
మత్తనూగత విషరక్త పాన కలన
భూత దయతోడ పుణ్యభూములకుఁ బోయె.

ఇదె కాఁబోలు ఋణానుబంధమనఁగా నీరాజ కన్యామణిన్
మృదు భావాన్విత నిర్మల ప్రణయ గంభీరాంతరన్ సర్వ సం
పదలన్ వర్ధిలు దాని భిక్షువునకై ప్రాణంబు లర్పించు న
ట్లదయుండై విలిఖించె దుర్విధి విషాదాశ్చర్యముల్ పెల్లుగా.

ఏ చిగురాకుఁ బోఁడి యలరించె ననున్ క్షణకాలమేని సం
కోచము లేక సౌధమునకున్ జన మంజుల నృత్యగాన వి
ద్యాచతురప్రసంగముల నర్మిలి స్వర్గము చూపె నా జయ
శ్రీ చనె శాంతిధామమును జేరఁగఁ బ్రాణములిచ్చి నాకిటన్.

ప్రాణప్రియవలెఁ జేతః
ప్రీణన మొనరించి బౌద్ధ భిక్షువు కొఱకై
ప్రాణత్యాగము చేసిన
ప్రాణియె జగమునకు ధర్మపథమును జూపెన్.

సొగసును జవ్వన మేచఁగఁ
దగులమ్మునఁ బొగిలెఁ గాక ! త్యాగమొనర్పన్
దెగువం జూపిన మగువకుఁ
దగదా సేయంగ నశ్రుతర్పణ మేనిన్.



# శ్రీ ము ఖ లిం గ ము

అదె శ్రీకాకుళమండల ప్రథిత పుణ్యక్షేత్ర మాంధ్రావనీ
సుదతీరత్నశిరోవిభూషణము చక్షుః ప్రీతి గల్గించు సం
పద విశ్వేశ్వర సత్కథాకలితశిల్పశ్రీవిలాసంబు మో
క్షదమౌ శ్రీముఖలింగదర్శనము దీక్షన్ వచ్చి వీక్షింపుడీ.

శ్రీముఖలింగ ధామమును జేరి ముదంబుగ వంశధారలో
నేమముతోడ మున్కలిడి నిష్ఠః ప్రదక్షిణమాచరించి మీ
క్షేమముగోరి స్వామికభిషేకము చేసి మధూకమూల మీ
గోముఖ రూపలింగమునకున్ ప్రణమిల్లి తరింపుడిచ్చటన్.

కృతయుగంబున ధర్మకృతమూర్తియై జయం
తీశ్వరుండుగ నుద్భవించి మించె
త్రేతాయుగంబున శ్వేతాంగధారి గో
కర్ణేశ్వరుండుగా గానిపించె

ద్వాపరమ్మున కాంస్యరూపమ్ము ధరియించి
మధుకేశ్వరుండుగా మహిమజూపె
కలియుగంబున శిలాకారమ్ముగా దోచి
ముఖలింగమూర్తియై పాలిచె నిచట.

కాశికాక్షేత్ర తుల్యమై కలుషమడచు
నీ మధూకేశ్వర క్షేత్ర మిందు సర్వ
తీర్థములు గూడి కోర్కెలు తీర్చుచుండు
పుడమి, ముఖలింగ దర్శనమ్మునకు రండు.

పూర్వము వామదేవముని ముఖ్యుని యజ్ఞము చూడవచ్చి గం
ధర్వులు మత్తులై మధువనమ్మున రూపవిలాసవిస్ఫురద్
గర్వితలన్ కిరాతకుల కాంతల గూడి సుఖించుచున్న గం
ధర్వుల దివ్యదృష్టిగని దర్పమడంగ శపించె వారలన్.

వామదేవుని శాపంబు వలన శబర
జాతిలో బుట్టె గంధర్వజాతి యంత
చిత్రసేనుడు ఱేడుగా చిత్తి వాని
భార్యగా నుండ చిత్కళ వచ్చి చేరె.

శబరరాజొక మధుకవృక్షంబు జూపి
చిత్తికొకకొమ్మ, యొకకొమ్మ చిత్కళకును
పంచి యిచ్చె, మధూకపుష్పముల నమ్మి
కొనుచు జీవింపుడని పంచె గూర్మితోడ.

సవరవెలంది గొన్న తరుశాఖను రాలినపూవు లమ్మివ
స్తువులను దెచ్చి వండి పతితో భుజియించుచుండు, నెప్పుడున్
శివు మదిలో దలంచుకొను చిత్కళ బంగరుపూలు రాలగా
నవి వెలకిచ్చి, తెచ్చి మధురాన్నములన్ దసియించు తద్విభున్.

సవరకొలంపురాణి మది జంగమురాలిని జూచి యోర్వలే
కవమతి దానితోడ కలహంబునకుం దిగి రట్టుసేయ, నా
సవతుల పోరు జూచి మనజాలక తేమను వైర కారణం
బవు మధుయష్టికన్ నఱికె నౌర ! కుఠారము బూని యంతటన్.

అగ్నిశిఖలు పుట్టె నద్భుతంబులు గల్గె
పుడమిజేమ మూర్ఛపోయె; నంత
చిత్కళం గరుణించి శ్రీమధూకేశుండు
గోముఖంబుతోడ గోచరించె.

భార్యాద్వయము బాధపడలేక యా యిప్ప
చెట్టుగొట్టిన చిత్రసేను డదుగో,
ఈర్ష్యా కషాయిత దృగ్విలోకన చిత్తి
ఖిన్నయై యిదె కూరుచున్న దిచట,
చిత్తి ప్రేరేపింప చిత్కళం జంపగా
సాయుధులై యున్న శబరు లరుగో
చిత్కళ పూసజ్జ చేబూని భక్తిత
త్పరత నచ్చట నిలంబడిన దదిగో.

ప్రమథ గణములతోడ దర్శనమొసంగు
శ్రీ మధూకేశ్వరోద్భవ స్థిరచరిత్ర
ద్వారతోరణమున జెక్కినారు కనుడు
చెలువుమీర కళిగాంధ్ర శిల్పివరులు.

ఏ శిల్పి చెక్కెనో యిట ద్వారబంధాల
కల్పలతాపూర్ణ కలశములను
ఏ శిల్పి విరచించెనిట మనోహరముగా
మిథున చిత్రమ్ముల మిసిమితోడ
ఏ శిల్పి సృజియించె నిచ్చోట చక్కగా
రమణీయ చామర గ్రాహిణులను
ఏ శిల్పి రచియించె నిచట స్వామిని గొల్వ
నరుగుదెంచిన యగస్త్యాది మునుల

భవుని కృపయున్న సకల సంపత్సమృద్ధి
రాగభోగాలు మోక్షమార్గంబు దోచు
శ్రీమధూకేశ్వరుని ద్వార సీమయిట్లు
శిల్పసుందరముగ విలసిల్లుచుండు.

శివకథలంబికా ప్రణయ జీవితగాథలు శక్తిరూపముల్
శివపరివార దేవతలచిత్రము లీశ్వర దివ్యలీలలున్
వివిధ విచిత్రరూపములు విస్మయమున్ గలిగించు మోక్షదం
బవు మధుకేశ్వరాలయము నంతట గన్పడు కుడ్యశిల్పముల్.

నిర్వికారుడు చింతామణీ గణపతి
యితడె సకలార్థ సిద్ధుల నిచ్చువాడు
దక్షిణావర్త వక్రతుండంబువాడు
సాక్షిగణపతి యిచట సాక్షాత్కరించు.

శివుని బిలువక యజ్ఞము చేయుచున్న
దక్షు శిరమును ఖండించి దాని దెచ్చి
హోమకుండములో వేయుచున్నవాడు
వీరభద్రుడు - శిల్పమ్మ్మతీరు గనుడు.

మహిషాసుర మర్దని యిదె
మహిమాన్వితమైన సర్వమంగళ యిదె ప్ర
త్యహము గొలిచెడి వారల
కిహలోకసుఖము లొసంగు నెప్పుడు దయతో.

పార్వతీదేవియు పరమేశ్వరుండును
స్నేహపూర్వకముగా నెత్తమాడ
శివుడోడె సకలంబు; చివరకు నందీశు
నొడ్డి వానిని సైత మోటువడియె
పర్వతేంద్రుని పట్టి పక్షంబు వారలు
నందిని గొంపోవ నలగుచుండ
కామారి యానతికై మోర సారించి
పడటు జూపులతోడ గదలునంది

నిశ్చలంబుగ నిలిచిన నీలగళుడు
మందహాస రోచుల జగన్మాత మనకు
దర్శనంబిత్తు రాదిమ దంపతు లిట
దక్షిణద్వార పట్టిక ధర్మనిరతి.

అష్టభుజమూర్తి జగదంబ యాదిశక్తి
మహిమలెన్నుచు నిట సప్తమాతృకలును
విఘ్నరాజును జేరి సేవింపుచుండ
సింహవాహని కొలువుండు శ్రీలుపొంగ.

ఈమె వారాహి శ్రీమధూకేశుదేవి
మహిషమర్దని యిదె సర్వమంగళయిదె
ఈశ్వరార్ధశరీరిణి యీమె గిరిజ
కొండజాతుల యిలవేల్పు గొలువరండు.

సేనాయుతంబుగా శ్రీవిష్ణువర్ధన
మధుకర్ణ గజపతి మధువనమున
జనుచుండ స్వర్ణపక్షముల పక్షులు రెండు
దుముకుచు పుట్టలో దూరిపోయె.
త్రవ్వించి చూడ చిత్రముగ గోముఖలింగ
మచట దర్శనమిచ్చె; హరుడు రాత్రి
కలలోన దోచి బంగరునంది నాణెముల్
వర్షించు; వచ్చును వలయు ధనము

కట్టింపు గుడి మాకు కమనీయ తోరణ
ప్రాకార యుతముగా పార్థివేంద్ర
యని యదృశ్యుడయ్యె నటులె బంగరువాన
కురిసె పుడమిజేడు గుడిని గట్టె.

కుమ్మరి నాగన్న కొడుకు పుట్టిన వేడ్క-
క్షీరాభిషేకమ్ము చేయ నెంచి
గోలెమ్ములను జేసి పాలతో నింపి గ
ర్భాలయమ్మును జేర్ప వీలుపడక
దుఃఖమ్ముతో దిక్కుదోచక గోలెమ్ము
కొడుకును ముంగిట విడిచిపోయె
మరునాటి ప్రొద్దున మధుకేశ్వరుని చెంత
తనయుండు పాత్రయు దనరుచుండె

పరమభక్తునిట్లు కరుణించి ప్రోచిన
మధుకలింగమూర్తి మహిమగనుడు
నాడు మట్టితోడ నాగన్న చేసిన
గోలె మచట నేడు గోచరించు.

ఇచట ముఖలింగమున మధూకేశ్వరునకు
మందిరము గట్టనెంచె కామార్ణవుండు
పూజలొనరించి దానిని పూర్తిచేసి
నట్టి మహనీయుడౌ వజ్రహస్తుడిడుగో.

ఎదుట మధుకేశు డాదిత్యు డిచట విష్ణు
వచట గణపతి వారాహి యిచట నలరు
మధుకలింగేశు నాలయమండపమున
నిలిచి పంచాయతన పూజ సలుపవలయు.

వేణుగాంగ నదీస్నాన విధులనాడి
అష్టలింగ ప్రదక్షిణమాచరించి
మోక్షదాయకముఖ లింగముఖము చూచు
సజ్జనావళికిక పునర్జన్మ లేదు.



# శా లి హుం డ ము

కనుఁడీ దివ్య శరన్నిభోజ్జ్వల తరంగన్ వంశధారా పయస్విని తత్తీర మహీ మహోగ్రశిఖరశ్రేణిన్ ప్రశాంతస్థలిన్ మనుజేంద్రుల్ ఘనమైన స్థూపములు నిర్మాణంబు గావింప బుద్ధుని ధ్యానించి తరించిపోయిరట ఆంధ్రుల్ శాలిహుండంబునన్.

ఏ రాజశేఖరు డిచట కట్టించెనో
స్థూపముల్ బోధిసత్త్వుని స్మరించి
ఏ శిల్పి సత్తముం డిచట శిల్పించెనో
బుద్ధదేవుని మూర్తి పొలుపుమిగుల
ఏ మహాతార్కికుం డిచట బోధించెనో
శూన్యవాద రహస్య సూత్రములను
ఏ సాధకోత్తముం డిచట జిజ్ఞాసమై
పడసెనో పరమ నిర్వాణ సుఖము.

ధ్యానయోగాన బౌద్ధధర్మానుయాయు
లెందఱు మహాత్ము లిచట తరించినారొ
సకల జన శాంతికుండ మీ శాలిహుండ
మరసి యానందమును బొందుఁడాంధ్రులార !

ఆ మహా చైత్యములును విహారములును
స్ఫటిక పాత్రల స్వర్ణపుష్పములు, నాటి
ఆంధ్ర సంస్కృతి కమర చిహ్నముగ నిలిచి
జ్ఞప్తి కెలయించు మన పూర్వ చరిత మనకు.

అష్టదళ పద్మరూప చైత్యమును జూడ
మనసునకు వచ్చు నష్టాంగ మార్గ మెపుడు
బుద్ధ ధర్మ సంఘంబుల మొనసి శరణుఁ
జొచ్చిరిట శాంతిగోరు భిక్షువులు నాఁడు.

బుద్ధదేవుని పూజించు పూవుబోణి
భావపరివర్తనము చెంది వచ్చినట్టి
ఆమ్రపాలియొ - దివ్యభావానుభూతి
వినతి సల్పెడి ఆంధ్రరాట్తనయయొక్కొ !

వీరలెవరొ త్రివిష్టపవీధి నుండి
చిత్రముగ బుద్ధదేవుని చేరవచ్చి
పుష్పమాలిక లర్పింపఁ బోవువారు
కమల నయనలు గంధర్వకాంతలేమొ !

ఈ చైత్యంబుల నర్హతోత్తములు పెక్కేండ్లెన్నియో ధర్మముల్
ప్రాచుర్యంబుగ బోధ సల్పి చనగా ప్రత్యక్షదైవంబునే
యోచింపం దొడఁగెన్ గళింగపతి, సూర్యోపాసకుల్ వాసిగా
నీచోటన్ భజియించినారెడదలో నీక్షించి యాదిత్యునిన్.

త్రిముఖయును షడ్భుజాకృతి దివ్యరత్న
ముకుటధారిణి శరశస్త్రములు ధరించి
రమ్యతరముగ సప్తాశ్వరథిక యగుచుఁ
దిరుగుచున్నది యిట దివోదేవి యేమొ ! !

అలరన్ దాంత్రిక బౌద్ధభిక్షుల కుపాయ ప్రజ్ఞ లేకంబుగాఁ
గలుగున్ సిద్ధి మహాసుఖంబు, కడు వేడ్కన్ జూడ దంత్రంబులన్
గల యర్థంబు లనర్థహేతువగు సంధ్యాభాషలో నుండుటన్
దెలియన్ రాక నశించిపోయిరట నంధీభూత చేతస్కులై.

మంత్రములు ధారిణులు మహామండలములు
మహిమ గోల్పడి చివఱకు మాసిపోయె
శిథిలమయ్యును మిగిలె నీ శిల్పకళయె
ఆంధ్ర శిల్పి ! ! నమస్కారమయ్య నీకు !

సమ్యగాజీవులై సౌగతు లిచోట
పాటించినారట పంచశీల
జైన తీర్థంకరుల్ జనుల నుద్బోధించి
రట యిందు పంచమహావ్రతములు

సూర్యనారాయణు స్తుతియించినారట
సౌరు లిచ్చుటనె త్రిసంధ్యలందు
ఇట సనాతన ధర్మమొసలారు సర్వ జ
నామోద యోగ్యమై యపుడు నిపుడు.

అతి మనోహరమగు కళింగాంధ్ర భూమి
నడరు సౌగత జైన సౌరార్ష ధర్మ
సంస్కృతికిఁ గేంద్రమైన యీ శాలిహుండ
మొక్క పరిగాంచి ధన్యత నొందుఁడోయి !!



# TYAGAMAYI

## Dr. Sobhirala Satyanarayana

సుప్రసిద్ధ కవి పండితులు, కళాప్రియులు,

ఆంధ్రాంగ్ల సాహిత్యాలలోను,

తత్త్వ మనస్తత్వ శాస్త్రాలలోను

ఎమ్.ఏ., పట్టభద్రులు

పరిశోధన పరిణిష్ఠులు

ప్రభుత్వ కళాశాలలో

ఆంధ్రోపన్యాసకులుగా

పనిచేసి పదవీవిరమణ చేసినారు.

8-2-96న బ్రహ్మైక్యమందినారు.



"విశ్వజ్ఞ" బిరుద విభూషణ వాస్తు జ్యోతిష విద్యాప్రవీణ

**కీ.శే. డా॥ శోభిరాల సత్యనారాయణ**

**రచనలు**

శ్రీ మదాంధ్ర మహాభారత శిల్పకళా దర్శనము

(సిద్ధాంత వ్యాసము - 4 భాగములు)

స్నేహమయి - పద్యకావ్యం

రాగమయి - పద్యకావ్యం

కోణార్క - పద్యకావ్యం

**శ్రీ విశ్వకర్మ విజ్ఞానకేంద్రం**

శ్రీకాకుళం - 532 001